# సమ్మె పిలుపు

## నాటకం

లక్ష్మీకాంత మోహన్



నవయుగ పబ్లిషింగ్ హౌస్
బ్రాడీపేట :: గుంటూరు

నవయుగ ప్రచురణ
అక్టోబరు - '53




వేదాన్తా ప్రెస్,
బ్రాడీపేట : గుంటూరు.

## ఒకమాట

నాటకరచనలో ఇది నా ప్రథమ ప్రయత్నం. నా ప్రయత్నం ఎంత వరకు సఫలమైందో సహృదయులైన పాఠకుల్ని, నటకుల్ని, ప్రేక్షకుల్ని, అందర్నీ తెలియజేయవలసిందిగా కోరుచున్నాను.

వెల్లటూరు
20-10-53

మీ . . .
లక్ష్మీకాంత మోహన్



# ఇందులోని పాత్రలు



1. శ్రీనివాసరావు : యువకుడు. కమ్యూనిస్టు. పెళ్లియింది వయస్సు-27.
2. రాజగోపాలరావు : యువకుడు. కమ్యూనిస్టు. ఒంటివాడు. వ-24.
3. రంగడు : హరిజనుడు. నిరుపేద. నడివయస్సు
4. రంగి : అతనిభార్య వ. 38
5. కరుణమ్మ : యువతి. పెండ్లయింది. రంగడికూతురు వ. 17
6. గురవడు : హరిజనుడు. వ. 35.
7. కోటేశు : హరిజనుడు. వ. 26
8. మరియమ్మ : అతనితల్లి. నడివయస్సు
9. రంగయ్య : భూస్వామి. వ. 40
10. అబద్దాలు : పేదరైతు కుటుంబానికిచెందినవాడు. రంగయ్యదోస్తు వ. 30
11. భూషయ్య : పురాతన కాంగ్రెసు భావాలుగలవ్యక్తి వ 50. మధ్య తరగతి రైతు.

వీరుగాక యింకా యిద్దరు రైతులూ, మీటింగుకువచ్చే ప్రజలూ, వొక సబ్ యిన్‌స్పెక్టరూ, యిద్దరు ముగ్గురు పోలీసులూ —



5 28-8-54

# సమ్మె పిలుపు



## ఒకటో రంగం

### బజారు

(శ్రీనివాసరావు పత్రిక చదువుతూ నడుస్తూంటాడు. అతనికెదురుగా రాజగోపాలరావు కూడా పత్రిక చదువుతూ కుంటుకుంటూ వస్తూంటాడు. యిద్దరూ వొకర్నొకరు చూడరు. అలా వచ్చి వచ్చి, చివరికి యెదురుబొదురుగా ఢీకొంటారు.)

శ్రీనివా. } యెవడ్రాడూ? (అని యిద్దరూ ఒకేసారి అంటూ,
రాజగో. } రెండోవాణ్ణి కొట్టటానికా అన్నట్టు చేయెత్తుతారు)

రాజ : (గుర్తించి) హారి నువ్వంట్రా!

శ్రీని : (గుర్తించి) హోశ్. యింతకీ నువ్వన్నమాట!

రాజ : అయితే, కాస్త చూసి నడవరాదూ?

శ్రీని : నువ్వు చూసి నడిశావ్రగామట్టూ? వేదాంత బోధ చెయ్యటం తేలికలేరా అబ్బాయ్, తన దగ్గరకొచ్చేప్పటికి తెలిసికోలేడుగా!

రాజ : వెనకటికి — శాస్త్రం చెప్పినట్టు — నేను చెప్పినట్టు చెయ్యమన్నాగాని, నేను చేసినట్టు చేయ్యమన్నానా?

శ్రీని : మన కాంగ్రెసు మంత్రులు అచ్చం అదే అంటున్నారు. కానీ - అబ్బాయ్ - కొందర్ని కొంతకాలం మోసగించ

వచ్చు; మరికొంతరిని యెల్లకాలమూ మోసగిచ్చవచ్చు; కానీ - అబ్బాయ్ - అందర్నీ అంతకాలమూ మోస గిచ్చ లేమురా!

రాజ : అయితే, కొందర్నన్నా మోసగించొచ్చు గందా? యేరానాన్నా?

శ్రీని : ఆ కొందరు గూడా మోసం తెల్సికొంటే? యేమవు తుంది?

రాజ : యేమవుతుంది? గుట్టు రట్టవ్వు తుంది. నాయకులు వినాయకు లౌతారు; కాంగ్రెసు నాయకులు మొన్నటి యెన్నికల్లో వెల్లకిల బడ్డట్టు వెల్లకిల బడతారు !

శ్రీని : అంతేగంద ! మరినీవేదాంతం యెందుకురా అబ్బాయ్ ?

రాజ : రాద్ధాంతం జరిగేవరకూ నిలవటానికి యెన్నికల్లో డింకీ కొట్టేదాకా కాంగ్రెసు నాయకులు బూమ్మీద ఆగారా నాన్నా ?

శ్రీని : ఆఁ. సరేగానీ - బజాల్లో నడుస్తావున్నా వాళ్లమరచి పోయేంతగా నిన్ను ఆకర్షిచ్చిన ఆవాక్యేమిటో కాస్త చెప్పుతావా అబ్బాయ్ ?

రాజ : ముందు నిన్ను అంత కళ్ళుమూసుకొని పోయేట్టు చేసిన ఆవాక్యేమిటో చెపితే.........

శ్రీని : అవా ? ఆఁ. యేమీలేదు. మరినీదీ ?

రాజ : నాదా ? యెబ్బెబ్బే యేంలేదు ?

శ్రీని : మరి అంత వాళ్లెట్లా మరచిపోయావురా అబ్బాయ్ ?

రాజ : అయితే అంత కళ్లెట్టామూసుకొని పోయినాయిరా నాన్నా ?

శ్రీని : ఆఁ పోదూ. యేంటా గిజినిపట్టు? యెక్కమంటే దక్కమంటావేంటి?

రాజ : మరి నువ్వో.? హైరాటంటే భైరాటంటల్లా?

శ్రీని : యిసికతక్కిడా...

రాజ : పేడతక్కిడా?

శ్రీని : సరేగాని – ఆ వార్తేమిటో తెలుసా? నైజాం నవాబు గారికి జలుబుచేసిందట. అదటా. యిదటా. ఆవార్తని యీ పత్రిక బాక్సుకట్టివేసింది. మరి నీ వార్తా?

రాజ : బెల్లవోలు గ్రామ వ్యవసాయ కూలీలు 20 రోజులపాటు సమ్మె; ఎక్కువకూలీ సంపాదించారని వివరంగావుంది.

శ్రీని : అది బాక్సులో వేశారా?

రాజ : వో.

శ్రీని : అది "విశాలాంధ్ర"?

రాజ : అదిగాక మరింకేంపత్రిక ఆ వార్తకి బాక్సు కడుతుందిరా?

శ్రీని : సరే మరి మన గ్రామం?

రాజ : అదంతా మనమీదవుంది.

శ్రీని : అంతా మనమీద ఏదోయ్? నువ్వు "సమ్మెపిలుపు" యివ్వగానే కూలీలు ఒక్కసారి కదల్తారనుకొన్నావా ?

రాజ : యేఁ? వాళ్లు బాధపడటల్లా?

శ్రీని: అంతేనా? యింకా యెన్ని! కులతత్వం వొకటి. భూస్వాముల బెదిరింపు. కులపెద్దల అదిరింపు. ఆపైని ప్రభుత్వం!

(ఇంతలో భూమయ్య అటువస్తాడు)

భూ : (నవ్వుతాలుగా) యేమిట్రా శీనూ ఆ వాదనా?

శ్రీని : ఆc. యేమీలేదేc. పత్రికలో వార్తచూసి చర్చించుకొంటున్నాము.

భూ : అంతేగంద!

శ్రీని : అంతగాక యింకేమిటి? (సరసంగా) మీ రాజగోపాలరావు కుంటివాడని వొంటికాలిమీద లెగుస్తున్నాననుకొన్నావా?

(అందరూ నవ్వుతారు)

రాజ : వొరే నాన్నా. కుంటాణ్ణయ్యినా నాతో గెలవలేవురో.

(మళ్లీ నవ్వు)

భూ : మావాడు అసాధ్యుడయ్యాయ్;

తిరిగి నవ్వు

శ్రీని : నవ్వులకేంగాని–భూమయ్యమామా – మీలాటి పెద్దాళు కాస్త కదిలి పనిచెయ్యాలేc.

భూ : యేంపనీ? యిప్పుడుండ పని చాలకనా?

శ్రీని : ఆపనిగాదు. వూళ్లో కాస్త మంచికీ చెడ్డకీ మీరు కదలాలి.

భూ : ఆc. మనంకదలి చేసేదేముంది పరిబూషిద? కంపకిలేని దురద చేమకెందుకు! అయినా మనవల్ల యేమవుతుంది!

శ్రీని : అట్టా అధైర్యపడితే యేంలాంభం చెప్పు?

భూ : కాక? ప్రతివాడికీ స్వార్థం యెక్కువయ్యి వస్తూవుంటే మనం యేం చెయ్యగలంరా పిచ్చాడా?

శ్రీని : స్వార్థం పెరిగింది గనకనే సంఘాన్ని బాగుచేయ్యాలనేది. జబ్బువున్నది గనకనే మందు. అసలు జబ్బే లేకపోతే యింకా మందెందుకూ? ఆ?

భూ : నిజమే; అవుననుకో. అయినా... సరే... వస్తానస్తా... కాస్త అటుబోయి రావాలి... (వెళ్తాడు)

రాజ : హుఁ. కాస్త అటుబోయి వస్తాడంట. యీయనబోయేది యెక్కడికో తెలుసా? భూస్వామి రంగయ్యింటికి! హుఁ.

శ్రీని : ఆఁ పోదూ. నీకెప్పుడూ యేదో వొక అనుమానమే.

రాజ : నంబిని నందీ నంబని పందీ అంటే తప్పా?

శ్రీని : ఆఁ పోదూ జీలకర్రా. యిట్టా అనుమానిచ్చటం మొదలెడితే చివరికి ప్రజలంతా దూరమై, లింగులింగుమంటూ నువ్వూ నేనే మిగుల్తాం! ప్రజావుద్యమం లేదూ పచ్చి బద్దలూ లేదూ. యేకో నారాయణా హరీ అని నువ్వూ నేనే వుంటాం.

రాజ : అది నిజమేననుకో. అయితే...

శ్రీని : ఆఁ పో!

రాజ : అదిగాదురా-యిటుసూడూ. నేను చెప్పేదంతా విన్నావా!

శ్రీని. : ఆ.

రాజ : అంతా!

శ్రీని : ఆఁ. అంతా! అంతా!

రాజ : అరె!

శ్రీని : ఆశ్ పో. వాగేయ్. అటుచూడు. రంగయ్యావాళ్లూ!

రంగయ్యా యిద్దరు రైతులూ, అబద్ధాలూ - వస్తారు

రం : యేమిటోయ్ శ్రీనివాసరావ్ యిక్కడుండారూ?

రాజ : యెక్కడుండామ్? బజార్లోవుండాం! గవన్మెంటు బజారు! (అందరూ నవ్వుతారు.)

రం : సరేగానీ, యేదోసమ్మె గిమ్మెఅని... మొదలెట్టారా...?

శ్రీని : ఆఁ. కూలీలంతా వొక కట్టుగానిలబడి హక్కులుసాధిచ్చుకోమని చెప్పుతున్నాం...

రం : అయితే నిజమేనన్నమాట?

రాజ : వో. యీసంగతి అబద్ధాలు చెప్పాడా?

అబ : అబద్ధాలెందుకు? యెవరికీ తెలవదా?

రం : వొరే, యెందుకురా మీకివన్నీ? చదువుకున్నావుగందా? సుబ్బరంగా యేదన్నా వుద్యోగంచేసుకొని హాయిగా బతకరాదూ?

మొ॥రై : భాగాఅన్నాను.

రాజ : యేదీ వుద్యోగం యిప్పించు చేస్తాం.

రం : యే? దేశంలో వుద్యోగసే లేదంటావా?

రాజ : వుంటే యిన్ని లక్షలమంది నిరుద్యోగు లెందుకుండే వాళ్లూ?

రం : నీకుసమాధానం చెప్పటం మహాకష్టంరా.

రాజ : నిజం చెప్పితే అంతేమరి.

రం : మీరుయెక్కువ కూలి యిమ్మంటే రైతులు యెక్కడ తెచ్చియివ్వాలీ?

ము|రై: బాగా అన్నారుగనక.

రం : వాళ్లేమన్నా బతకాలా?

రాజ : పాపం, అంత దయగలాడివి నీపొలం వొకబస్తాతక్కువ కౌలుకి యివ్వరాదూ?

రం : అదెట్లా?

రాజ : మరి? కుండలోకూడు కుండలోనేవుండాలి, బిడ్డమాత్రం దుడ్డల్లేవుండాలీ! రైతులమీద మీకేదో ప్రేమవున్నట్టు ఆనటం యెందుకూ?

అబ : వొకేయ్. చెప్పేవాళ్లు ముందుమీరు యివ్వరాదంటరా యెక్కువకూలీ!

రాజ : ఆ యిస్తాం. మరి అందరిచేతా నువ్వు యిప్పిస్తావా?

అబ : ముందునువ్వు యివ్వూ.

శ్రీని : నిరుడు పంతానికని నేనుయిచ్చా. యెవరన్నాయిచ్చారా? అందువల్ల సమస్య అట్లాపరిష్కారంకాదు. అందరమూ వొక రాజీకిరావాలి.

ము|రై: యెందుకమ్మా మొగుడిపొమ్ము తెచ్చియ్యమంటావురా?

శ్రీని : వుండుమామా, గోపకడమాక. రోజురోజుకీ మనపరిస్థితి దిగజారిపోతున్నది...

రెం|| రై : అందుకని యింకా దిగజారగొడతావా?

శ్రీని : కాదు. చెప్పేదినండి. మన తండ్రులకాలంలో పదెకరా లుంటే మనకాలంలో రెండెకరాలు వుంటున్నవి. యిక మనబిడ్డలు కూలీ చేసుకోవాల్సిందే. యిదంతా యీ బానిస ఆర్థిక విధానంవల్ల జరుగుతున్నవి. యిదిమారితే గాని మనకి మోక్షంలేదు. మనం యివాళగాకపోయినా రేపైనా కూలీలం అయ్యేవాళ్ళమే. అందుకని భూస్వాముల మాటలువిని మోసపోరాదు. కూలీల న్యాయమైన హక్కుల్ని గుర్తించాలి. మన హక్కుల కోసం మనం భూస్వాములమీదా, ప్రభుత్వంమీదా వొత్తిడితేవాలి కూలీల్తో గలిసి...

రం : ఆరి వూరుకోరా యెవ్వరన్నా నవ్వుతారూ! యింత చదువూజదివి యిదా మీరు చెప్పేదీ?

రాజ : లేదు. యింత చదువూజదివి ధనికులకి సలాంగొట్టి వూడిగం చెయ్యండిరా అని ప్రజలకి చెబితే బాగుండేది? కాదూ?

అబ : కాకపోతే నువ్వొత్తుకొద్దుగాని ఆగవోయ్!

రాజ : యేంటది?

అబ : సొతంతరం!

రాజ : నేను వొక్కణ్ణే తెస్తానని నీకు చెప్పానా? ప్రజలంతా కలిసి తేవాలి. అంతేగాని నీవల్లా నావల్లాయేమి ఒరగదు!

అబ : హోశబ్బో! మొనగాడు! ప్రజలు!

రం : మనకెందుకు రండయ్యా, పోదాం. (వెళ్తారు).

మరియమ్మ గబగబా వస్తుంది.

శ్రీని : యేంటమ్మా?

మరి : మా దొరసాని తమున్నెందుకో దబ్బున రమ్మంది.

శ్రీని : ఎవరు? మమ్మా?

మరి : ఆఁ. ఆఁ.

శ్రీని : యెందుకో?

మరి : యేమోనండీ. తమురి శిన్నబ్బాయికి బారకంగా వుండాదని శెప్పింది. అందుగ్గావాలు......

శ్రీని : సరే నీకెక్కడ కనపడింది?

మరి : నేనూ దొరసానిదగ్గర కాత్తి బువ్వడుక్కుపోదామని వచ్చినా. వత్తే, యీమాట శెప్పింది...దబ్బుని యెల్లండి. మరీమరీ శెప్పింది...

శ్రీని : సర్లే. నువ్వుపో...... (మరియమ్మ వెళ్తుంది.)

రాజ : పదరా వెళ్దాంపద. (అంటూ యిద్దరూ వెళ్తారంటే, యెదురుగా కరుణ వస్తుంది. రాజగోపాలరావు ఆమెని చూసి ముఖం చిట్లిస్తాడు).

శ్రీని : యేమమ్మా? నాకోసమేనా?

కరుణ : అవున్దొరా. తమురికోసమే. యేండా, అంతా తిరిగి యిట్టావచ్చా.

శ్రీని : సరే; యేంపనిమీద?

కరుణ : మా అమ్మకి సాలా బారకంగా వుండదండి. కాత్తి తమురు రావాలి. మన్ను తముర్తో మాట్టాడాలంది.

శ్రీని : (వ్రూశ్ అంటూ నిట్టూర్చుతూ) సరే. వస్తున్నా పద.

(కరుణ వెళ్తుంది. యిలా వీరు మాట్లాడటం అబద్దాలు దూరాన్నుంచిచూసి తల యెగురవేస్తాడు. అతన్ని చూసిన రాజగోపాలరావు రుసరుసమంటాడు.)

రాజ : అరేయ్. అటుచూడు. ఆ అబద్దాలుగాడు, మనం కరుణతో మాట్లాట్టం చూసి......

శ్రీని : ఆక్ పో. యేంటాగొడవ?

రాజ : వాడు చూశ్రా. నిన్ను అందుకనే ఆడవాళ్ళంతో మాట్టాడొద్దురా అంటూ. యిప్పుడుచూడు. వాడేదో పెద్దరహస్యం కనిపెట్టినట్టు మనెంక యెట్టాజూస్తన్నాడో?

శ్రీని : అరె. నీకుగాదు చెప్పేది? ఇటు నాతల్లికబురు; అటు యింకొక తల్లికబురు. యెటుబోవాలి?

రాజ : యెటుబోవేదేంటి? ముందు మాలపిల్లి వెళ్దాంపదరా.

శ్రీని : (అతని భుజంతట్టుతూ) భేష్. గొప్ప మనసున్నగలాడివిరా. పద ముందు మాలపల్లె వెళ్దాం.

## రెండో రంగం



### రంగడి యిల్లు

చాలా యిరుకుడి. వోమూల పొగచూరిన వుట్లు, యింకొకప్రక్క నొకకుక్కిమంచం. (యివిగాకయింకామామూలువన్నీ వుంటాయి) ఆమంచంలో రంగి పడుకొని మూల్గుతూంటుంది. వాకిలిదగ్గర రంగడు కూచొనివుంటాడు. అతని ముఖంలో యేదో తీవ్రమైన ఆందోళన, బాధా స్పష్టంగా కనిపించు తూంటాయి. మాటిమాటికి విసుగడపడుతూ (Fidgets) పిచ్చిచూపులుచూస్తూ హృదయంలో గుచ్చుకొన్న యేదోముల్లు బాధపెడుతూన్నట్లుగా మూల్గు తూంటాడు.

శ్రీనివాసరావు, రాజగోపాలరావు వస్తారు.

రంగడు: (గబుక్కున లేచి, యింట్లో అటూ యిటూ చూసి, వొక మకిలిబట్టిన పీటవేసి శీనువంక దిరిగి) కూసోండి దొరా. (అని రెండోవారికి కూచోటానికి యేమీ లేదే అని చుట్టూ చూసి, వొక గోతాంపట్టా రాజగోపాల్రావుకి వేసి) తమరుగోడా కూసోండిదొరా.

శ్రీని } రాజ } వొద్దులే. యేంపర్వాలేదు.

రం: కాదు దొరా, కూసోండి. యేదో లేనాళ్ళం.

రాజ: యేమీ అక్కర్లేదయ్యా. మేమేమన్నా ధనికులమా మర్యాద చెయ్యలేదనుకోటానికి!

రం: దనీకులు మాబోటోళ్ళ కొంపలకొత్తారా దొరా? యేదో తమరు మాబోటి లేనాళ్ళకోసరం శెమజేస్తావుండారు గామట్టి వొచ్చారు. కూసోండి...

రాజ: అక్కర్లేదన్నాంగా. (ఆయిద్దరూ కింద కూచుంటారు వాకిలిదగ్గర)

శ్రీని: ఆఁ. యేంటి కబురంపిచ్చారు?

రం: యేముంది దొరా? యింటో పిల్లా మేకా, పెద్దా శిన్నా యావచాత్తీ సస్తుండామండీ బువ్వలేకా. యేదో తమరు యెరిగినోరని, యేమీ అనుకోరని, యేదో కాత్తి... దాతండ్రీ తమరితాతగారిపన్లోబతికాడు. తాతగోరెంత ఘంచోడు! యెప్పుడన్నా బోనీ అడిగింది లేదనేవోడు

గాదు. అట్టాంటివి పెద్ద పెద్ద యెత్తైమానాలకిబోయి ఆయిల్లు గట్టిచ్చి, పిల్లలకి పెద్దపెద్ద కట్నాలిచ్చి, అప్పులపాలయ్యి, తీరా తప్పరి నాన్నగోరు తిరిగొచ్చేతలికి కాసన్న మాట మిగలకుండాబోయింది.

శ్రీని : యెవరిదగ్గర అప్పుతెచ్చాడో?

రం : యెవరిదగ్గిరేంది? మన రంగయ్యలేడూ...

శ్రీని : యేవీ మన భూస్వామా? ఆయన చిన్నాడుగా? మా తాతకెట్టా అప్పెట్టాడూ?

రం : కాదుకాదు. అదిగాదండీ. యీ రంగయ్య తండ్రి అప్పెట్టాడు. అసలదివరకి యీరికి యెంతన్నుండేదీ! యిప్పుడైతే యెకరమో మూడెకరమో. యింతే.

రాజ : యిప్పుడు మూడువందల యకరముంది.

రం : ఆఁ. ఆఁ. అదంతా యిదుగిట్టా సంపాదిచ్చిందే. అప్పులిచ్చి, యెవ్వరన్నా దాసుకొంటే మింగీ...

రాజ : పంచాయితీబోర్డు డబ్బు గుటకాయస్వాహాచేసి...

రం : ఆఁ. ఆఁ. గదేనండి; గదేనండి; గట్టాగే దిబ్బలేశి

శ్రీని : అవిసరేలే. యిప్పుడు పిలిపించిందెందుకు? [పోయారు.

రం : యిదే. యిదే... రంగయ్యగోరు మాకు పొంతుబత్తాలొద్దు యివ్వాలుండి.

రాజ : యెందుకివ్వాలి?

రం : రొండేళ్ళనాడు నా చిన్నకొడుకుని ఆయినదగ్గిర గొడ్డు కాయటానికి కమతం బెట్టామండి. ఆఁ. ఆ దిగుదాటు

యియ్యమని యెన్నితడవలడిగినా యిదుగో అదుగో అంటాడండీ. మరి యింటో నాఅంటే ఇట్టావుండె... గెట్టాబతకాలి దొరా?

రాజ : నువ్వుబతికితే ఆయనకిగావాలా, బతక్కపోతే ఆయనకి గావాలా? అదంతావుంటే అంతఆస్తియెట్టాసంపాదిస్తాడూ?

రం : అంతేదొరా. అంతే అంతే.

శ్రీని : అయితే యిప్పుడు మమ్మల్నేం చెయ్యమంటావు?

రం : యేమీ లేదండీ. తప్పుడు కాత్తి... అయిన్నె.....

శ్రీని : అడగమంటావా?

రం : ఆఁ. ఆఁ. గద్ గదే.

శ్రీని : వొ. అడుగుతాం. కాని వొక్కమాట. మేముఅడిగినంత మాత్రానేయిస్తాడనిభ్రమలుపెట్టుకోవాక. తెలిసిందా? కూలీల్లో ఐకమత్యం, కట్టుబాట్లు లేనంతకాలం యింతే ననుకో. తెలిసిందా? కూలీలంతా యేకమై నిలిస్తే యీ బాధలు వుండవు.

రం : అయికమత్తెం యెట్టావస్ది దొరా. నేను మూడు మానికెలు కూలడిగితే నాపక్కనోడు రెండు మానిక లంటావుండె. గెట్టాదొరా యింకా అయికమత్తెం?

శ్రీని : అవును. అదేమరివచ్చిందిచిక్కు. మనలో అది లేకుండా చేసుకోవాలి.

రం : యేమో దొరా.

( ఆ సమయములో గురవడు వచ్చి కూచుంటాడు. )

రాజ : అదిగాదయ్యా. మరియెంతకాలమని యీ బాధలు పడతామంటావో చెప్పూ

రం : యేంశేద్దాందొరా? నలుగురూ నాలుగుదోవలయ్యె. మతిలేనమ్మకి మనుమడే మొగుడూ, గతిలేనమ్మకి గంజే పానకమని మా సచ్చినోళ్ళు ఆగంజి యోసిపోద్దోనని సస్తాన్రండిరి.

గుర : ఛీ. మా మాలోళ్ళంత అలికీరకం లేమండీ. యేదన్నా యిక్కడ వొకమాట అనుకుంటామా. ఆమాట నిమ్మిట్లమీద రంగియ్యోరికి శేరద్ది! యింకాయేంది శెప్పండి.

శ్రీని : అదేమరి. మీలో కట్టుబాటు లేదు.

గుర : పోనీ, ఆయినేమన్నా యీళ్ళకి వూరికినే పెడతన్నాడా అంటే అదీలేదు. యేపొద్దూ పనిలో కొట్టకుంటేగాని యీళ్ళ మొకాన యిన్నిగింజలు పొయ్యడు.

రం : ఆ యిచ్చేదీగూడా సరన్న బూతుంటాం తిట్టి!

గుర : యేంద్? ఆయిచ్చేదీ మా త్తరం సరిగ్గాయిస్తాన్నాడేంటి? నీకు ఆరొండేళ్ళనాటి దిగుబాటు యిచ్చాడంట్రా?

శ్రీని : ఆ సంగతే మేము మాట్లాడేది.

గుర : దానికిదోడు ఆర్నెల్లు పనుంటే ఆర్నెల్లు పన్లేదు.

శ్రీని : అవును.

గుర : మెల్లిగా అంటారేముంసే? వొకపూట తిని వొకపూట తింకా యెట్టా బతుకుతుండామో యేందో ఆ భగమంతుడికే యెరిక!

శ్రీని : అన్నుమరి

గుర : అబ్బబ్బ. మా మాలోళ్లంత బాదపడేవాళ్ళు యీ బూమిమ్మీద యెవరూ లేరంసే......

శ్రీని : మీకుమల్లె బాధపడే కూలీలు అన్ని కులాల్లోనూ వుండారు........

గుర : యెబ్బొబ్బ లేరంసే.

రాజ : అదొట్టిమాట. వూళ్ళోకిపద. యెవరు యెట్టా బాధ పడతన్నారో చూపుతాను.

రం : ఆమాట నిజమేరా గురవాయ్.

గుర : ఆఁ. యింతబాదా?

శ్రీని : యింతబాధా! యింతకంటే యెక్కువ గూడాను వొకొక్కళ్ళ విషయంలో.

గుర : (రంగడివంకజూస్తా) మళ్లి వస్తానొరా. (అని శ్రీనుతో అంటూ, వెళ్తాడు)

శ్రీని : యెన్నాళ్ళమట్టి నీ భార్యకి జబ్బ

రం : రొండు రోజులమట్టీ.

శ్రీని : అయితే అట్టా మాటాపలుకూ లేకుండా పడున్న......

రం : అది మామూలుజబ్బు గాదండీ

శ్రీని : మరి?

రం : కలరా!

శ్రీని } ఆc—!!!
రాజ }

శ్రీని : జరం అనుకున్నానే. పల్లెలో యింకెవరికన్నా సోకిలిందా?

రం : పెద్దగా లేదు.

శ్రీని : హెల్తాఫీసరుకి రాస్తాముండు. అయినా, ఆయనొచ్చేసరికి మిగిలేపోతుందేమో...యెన్ని వుత్తరాలో రాస్తేగాని వాళ్ళు కదల్రు.

రం : మన వైద్యులకేమో డబ్బుగావాలి. నిన్నటిమట్టీ వొకటే తిరుగుతుండా. వొక్కరన్నా వొక్క దమ్మిడీయియ్యాలా.

రాజ : మరి దర్మాసుపత్రి......

శ్రీని : ఆc. యేడ్చింది, ధర్మాసుపత్రి! సొరకాయలో నెయ్యెంతవుందో యీధర్మాసుపత్రిలో అంతధర్మముంది! లంచం, డబ్బు, అదిలేందే పనిజరగదు......

రం : నూరేళ్ళాయుస్సు! సత్తెంపలికామాదొరా. సరుడి టాగే మాఅల్లుడి చెల్లెలు గర్భిణీఅయితే, పెసవించలేక బాద పడతాంటే, ఆపక్కే మంచంమీద యేసుకొని, అక్కడికి తీసుకుపోయాం. సూడండి — పొద్దునవచ్చి

మనిషిని ఆ ప్రయత్నాలు సాయంత్రందాకా సూడలా. ఆపక్ని యేం చెరిగించనుకొన్నావు? వాళ్లొచ్చి సూడనిచ్చే సరికి ఆపిల్ల సచ్చిపోయింది!

శ్రీని : పాపం!

రాజ : మరి బిడ్డ?

రం : బిడ్డా? బిడ్డ కడుపులోనే సచ్చిపోయింది!

రాజ : కాస్త వైద్యం చేయిస్తే సరిపోగేదే.

రం : డబ్బెక్కడ తెచ్చేమిరా?

శ్రీని : అప్పన్నేమరి... సరే. యికవస్తాం. రంగయ్యాగాన్ని అడుగుతాలే. కాని, నువ్ మొదటచెప్పింది మాత్రం బాగా గుర్తుపెట్టుకో.

రం : చిత్తం చిత్తం. కొంచం ఎంతికెపోమాకండి......

రాజ : పో. యేంకర్యాలేదు. (నిష్క్రమణ)

ఈ యిద్దరూ అటువెళ్ళగానే, రొంగపాళ్ళ గురవడు వస్తాడు. రంగడూ, గురవడూ మెల్లగా మాటాడుకుంటారు.

గుర : (మెల్లగా) యేరా, మరియేమనుకొన్నారు?

రం : యేముందిరా? యేందో నాకంతా అయోమయం...

గుర : యికఅట్టాగయితే మెట్టాగ?

రం : యేంచెయ్యమంటా?

గుర : అదే.

రం : అది నాకేం నచ్చలేదురా. మనోయ్యదొర శెప్పిందే బాగావుంది. అందరమూ అయికమత్యం...

గుర : గాడిదగుడ్డు!

రం : యెప్పుడుకయినా మనమంతా వొకకట్టుగానిలిశి సాదించుకోవాలిగాని, గిట్టా......

గుర : సూడూ—అదెక్కడన్నా జరుగుతుందంట్రా, పిచ్చోడా? వూఁ. జరుగుతుందనుకో. యీలోపల మనల్లా జెల్లా యేంగావాలి!

రం : అవును. ఆమాట సత్తెమే...కానీ...

గుర : కానీలేదూ గీనీలేదూ... శేతోన్నొదిలి కాల్లొట్టుకోట మెందుకురా?

రం : యేదిశెయ్యి, యేదికాలూ?

గుర : నేను శెప్పిందే శెయ్యి, నువ్వు శెప్పేది కాలు.

రం : అదెట్టా?

గుర : అట్టాగే, కాస్త ఆలోశిచ్చు. నీకే తెలిసొస్తది. యింటో వొకేపున పెళ్ళాం సచ్చిపోతావుంటే, సింగినాదం జీలకర్రా అంటావేరా?

రం : యేమోరా. నాకంతా అయోమయంగా......

గుర : వోరి పిచ్చోడా. బలేశానును జిక్కించిరా. సిన్న పొలం అమ్ముకొచ్చిన డబ్బు తెచ్చియింటో పెట్టాను. ఆడునేమో

ఇయ్యాల వూరెళ్లాడు. ఆయింటో ఆడాళ్లేమాత్తరం
వుండారు. మగాళ్లెవుళ్లూ లేరు. బలేచాన్సు! నువ్వో యొయ్యొస్తా.
వూరికినే జేటుకాపలాగావుండు. తక్కినపనంతానూనాదే! ఆ?

రం : యేమోరా.

గుర : అమగో మళ్లి. బలేశానుసూరా అంటే!

రం : సరే.. కానియ్యి... అన్నిటికీ ఆభయమంటూ వుండాదు...

గురు : ఆఁ. అట్టారావరసకే. లేకపోతే యేందిరా. యెవుడారి
యిన్నిశాదలు పడతా నీకుమళ్లే శేతులుముడుసుకూ-
కునేదీ?

రం : సరే...కానియ్యి......

గుర : యికనేనత్తా...తక్కిన యిస్సర్షి కలుసుకోవాలి...ఆ?
మరిశిపోమాకా...తయారుగా వుండు.....వస్తాగో...
(వెళ్తాడు)

రం : హరిబాబ... ముందునుయ్యా యెనకగొయ్యా......
హిరీ... (సందంలోని షెళ్లాంవంకజూసి) యిపనలు
కళ్లుదెరిశే ఆఁ వూఁ అనదేమంట!? (దగ్గరకెళ్లి రంగిని
చేత్తోతట్టుతూ) వాశేయ్...వాశేయ్...వుసాూఁ...
మన యిపిలో లేదు...ప్చ్.....హిరీ

కమల వస్తుంది.

కమ : (లోనికి వాస్తూ) అయ్యా...నారయ్యా...యిప్పుడా
మనిషీ?

రం : ఆఁ. ఏందేఁ.?

కమ : అమ్మ కెట్టావుంది?

రం : యెట్టావుండాలో అట్టాగేవుండది!

కమ : ఆఁ— !!!

రం : మనయిది లేదేఁ, మాటాపలుకూ లేదు...

కమ : (చేతులు కొట్టుకొంటూ) హామ్మో.....

రం : ఏడవమాక. బతికేవుండది. వాళ్లొయొచ్చేగానే లేసది...

కమ : (దగ్గరకొచ్చి చూస్తా) హామ్మ.....

రం : యెక్కడికిబోయా?

కమ : యెక్కడనని శెప్పను? అన్నిసోట్లకీ బోయొచ్చా. యాడా గింజగోడా లేవన్నారు...

రం : హిఁక్...పిల్లలేరీ?

కమ : ఏమో...

రం : నేనటు బోయిరావాలిగానీ, నువ్వు అమ్మనిసుంటు.

కమ : వుంటాలే.

రం : పిల్లలొచ్చి బువ్వకోసం గోలమొదలెట్టితే, అయ్యాబువ్వ తేబోయాడని శెప్పు...సరా? ఆ?

కమ : (కన్నీళ్లు తుడుచుకొంటూ) అట్టాగేలే...

రంగడు వేటికిపోతాడు

కమ : ఛీ. యెవ్వణ్ణీ రామరామ అనగూడదు...

రంగి : (కళ్లుదెరిచి, మూల్గుతూ) అమ్మాయ్...

కరు : అమ్మా. అమ్మా. (తల్లి మంచందగ్గరకి త్వరగాపోతుంది) యేందమ్మా?

రంగి : వూఁ. (దాహంఅని చేసైగచేస్తుంది. కరుణ వొకమట్టి ముంతతో తెచ్చి నోట్లోపోస్తే గట గట తాగుతుంది.) అమ్మా. నన్నెట్టాగయినా బతికిచ్చండే...

కరు : సూస్తానే వుండామమ్మా...యేంజేశేమి? యెవరూ పలకటం లేదు...

రంగి : యెట్టాగమ్మా మరీ? పిల్లలేమౌతారు? మీరేమౌతారు?

కరు : యేంజేద్దాం?

రంగి : సూడవేఅమ్మా. యెట్టగన్నా సూడవే...

కరుణ ముఖం యేదో ఆలోచనలో నిమగ్నమౌతుంది. అంతలో ఆమె ముఖంలో యేదో రేఖ తళుక్కుమంటుంది.

కరు : అయితేవుండమ్మా. నేనిప్పుడేవస్తా. శిన్నాణ్ణిపంపుతాలే..

రంగి : పోమ్మా, పోయియెట్టగన్నా... (కరుణ వెళ్తుంది.)

## మూడో రంగం

రంగయ్య పెంకుటిల్లు.

( ఆయింటి వసారాలో రెండు మూడు కుర్చీలూ, వొకటేబులూ వుంటాయి. వొకగోడకి గాంధీ మొ॥ వారి పటాలుంటాయి. )

కుర్చీల్లో రంగయ్య, భూషయ్య కూచునివుంటారు. అబద్ధాలు అరుగు మీద కూచునివుంటాడు. అతడిపక్కనే యిద్దరు రైతులుకూడా వుంటారు.

రం : అవు నవును. అంతేనండీ. డబ్బుకు వచ్చిందండీ యెక్కడ లేని కాటకమూనూ.

భూ : కాకపోతేయేమిటి? యెవర్నికదలించినా 'డబ్బులేదు, డబ్బులేదు' అన్నమాటేనయ్యా!

మొ॥రై: తమరే అట్లా అంటే యిక మాజోటివాళ్లకెంత యమలోకమో చూడండి.

రం : కాదుమరీ! కాదంటయ్యా పిచ్చోడా!

అబ : యేం॰ ఆయనంటే, ఆయనకుండేకష్టాలు ఆయనకి లేవూ? యెంతచెట్టుకి అంతగాలి!

రెం॥రై: హాదీ!

అబ : నేనుజూస్తున్నాగా, రంగయ్యగారి కుండేకష్టం యింతా అంతాగాదు...

రం : యేముటో! అనుకోంటాంగానీ, మనబోటి వాళ్లదగ్గర యేండబ్బు వుంటుందండీ?

భూ : అవును.

రం : యీవాళ కూలి జేసుకొనే కూలాళ్లు నయంమనకంటే. యేమంటావు?

భూ : అవును.

రం : వాడు యేరోజు రూపాయ ఆరోజు కళ్లజూస్తాడు. నీకూ నాకూ సంవత్సరం తిరిగొచ్చేదాకా డబ్బే?

భూ : అవునవును.

రం : మరి కమ్యూనిష్టులేమో కూలీలు నానాబాధలూ పడు తున్నారని ప్రచారం చేస్తారు.

అబ : వాళ్ల మాటల కేంలెండీ.

రం : అసంగా—జబ్బువచ్చి చచ్చే మనుష్యులుండొచ్చుగాని, తిండిలేక చచ్చేవాళ్లుండారా దేశంలో?

భూ : అవునవును.

రం : మరి యీపత్రికలు అక్కడో యిక్కడో తిండిలేక చచ్చారని వార్తలు వేస్తయ్యెందుకూ?

అబ : ఆవార్తలే వెయ్యకపోతే, పత్రికలెట్టా అమ్ముడు బోతయ్యండీ?

రం : పత్రికలవాళ్లు అబద్దాలురాస్తే, వాటిని యీకమ్యూనిష్టులు ప్రచారం చెయ్యనా?

అబ : అసలు వాళ్లకూడే అబద్ధపు కూడండి.

రం : భాగాఅన్నావురా అబద్ధాలూ

భూ : కానీ—అష్టట్టూ—యీమంత్రులు వట్టి అసమర్థులండీ.

రం : భాగాఅన్నావు. అసమర్థులూ, అసమర్థుల్లో మొదటి రకమూనూ! వొక్కపనంటే వొక్కపనన్నా చెయ్యగలిగారా, జేబులు నింపుకోటంతప్ప?

భూ : అవును. అందుకనేగా నాబోటాడు—జైలుకి పోయి వచ్చినవాడు—మెదలకుండా కూచ్చున్నదీ! కాంగ్రెసు హంశ గాంధీగారితోనే పోయింది...

రం : ఆఁ. చచ్చింది. వొకప్పుడు వీళ్ళు సరిగా జేశారంటారా? యెప్పుడూయింతే. అమ్మ పుట్టిల్లు మేనమామదగ్గిరా పొగిడేది?

భూ : కాదుకాదు. అట్లాఅనమాకండి. మొదట్లో అంతా బాగానేవున్నది. కాని, పదవులురాగానే కుక్కలు చింపిన విస్తరయ్యింది.

రం : వుహూఁ. నేనునమ్మను. వొక్క విషయంచూపండి. యెటువంటి గుడ్డికొక్కిరాయికన్నా బెజవాడలో రాజధానుంటే మంచిదని తెలుసు. మరివీళ్లందరూ గలసి చేసిందేంటి?

భూ : అవును.

రం : యెటుదిరిగీ, ఆ కమ్యూనిష్టులే పసువునిలిపారు. బెజవాడలో రాజధానివుండాలని వాళ్ళు మొదట్నుంచి మొత్తుకొంటానే వున్నారు. అంతేగాని, తక్కినవాళ్లకి వొకసిద్ధాంతమూ, వొకరాజకీయమూ యేడ్చింది? యేమండీ?

భూ : అవునవును.

రం : కాకపోతే, యీకమ్యూనిష్టులు భూములు పంచమంటారనీ, దౌర్జన్యంచేస్తారనీ కష్టంగానీ, అసలు కమ్యూనిష్టులకండ పట్టుదలా, సిద్ధాంతం తక్కినవాళ్లకి యేడ్చినయ్యా?

భూ : అవును.

రం : అసలామాటకొస్తే, కమ్యూనిష్టుపరిభుత్వం వస్తేనే మంచిది. యీకుళ్ళుకంపు అంతా వుండదు. తప్పుచేసిన వాడ్ని షైర్ అంటారు. మనభూములుపంచితే పీడాపాయె. అదేసయం. అందరూ హాయిగాబతకొచ్చు. యేమంటారు?

భూ : అవునవును.

రం : యేరా అబద్దాలూ, అట్లా తెల్లబోయి చూస్తావేంటి? నేనే యీమాటలన్నాననా? ఆరిపిచ్చాడా, కమ్యూనిజం యివాళ గాకపోతే రేపన్నా వచ్చేదేరా!

అబ : అంతేలెండి మరి.

రెం॥రై : వచ్చేది రాకమానదప్పదు, పోయేది పోకమానదప్పదు.

మొ॥రై : అంతేఅంతే. అంతా ఆ పరమాత్ముడిదయ.

రం : లేకపోతేయేంటి? ప్రితివాడికీ లంచమేనా? లంచం! లంచం!! లంచం!!! యిదేనా గవర్నమెంటు? ఆ తెల్ల వాడుండగా యెంతబాగుండేది!

భూ : అవును. ఆ రోజులువేరు.

రం : ప్రితిదీ బలవంతమే. గవర్నమెంటు అప్పుకావాలీ అన్నదంటే కలెక్టరో తాశీల్దారో వచ్చి మెడమీద కూచుంటాడయ్యె! బలవంతానా అప్పులుతెచ్చేదీ? యెవడిష్టంవాడిదీ. యిస్తే యిస్తాము; లేకపోతేలేదు. యేమండీ?

భూ : కాదండీమరీ.

రం : ఛీ. ప్రితిదీ యింతేనండీ. అంతాయింతే...అసలు వీళ్ళవల్ల యేమీగాదండీ ..వాళ్ళపనిగాదు...వాళ్ళపని జరగదు, వాళ్ళిదెబ్బ దండగతప్ప...

భూ : వస్తానండీ, కాస్తపనివున్నదీ...

రం : యేం? వెళ్ళొచ్చులెండీ.

భూ : కాదుకాదు. యిందాకెప్పుడో పోవాల్సింది.

రం : సరే. వెళ్ళిరండి. (భూ య్య వెళ్తాడు.)

రం : వొరే అబద్దాలూ. నువ్వు వూళ్ళోకిపోయి అప్పన్నగారి పెదసుబ్బయ్యని పిల్చుకురా. పో. (అ ద్దాలు వెళ్తాడు)

రం : ఆఁ. యేమిటయ్యా మీరువచ్చినపనీ?

మొ॥రై : తమకెరగందేమున్నది?

రం : యెందుకో చెప్పూ.

మొ॥రై : మగతా పొలంకోసం.

రం : యేభూమి?

మొ॥రై : పడమటి పొలాన్ది.

రం : అది భద్రయ్య చేసుకొంటున్నాడుగా.

మొ॥రై : అయితేయేం? ఇయ్యేడు నాకుయిప్పిస్తారేమోనని.

రం : అతణ్ణి అడక్కుండానే?

మొ॥రై : అడిగేదేంటిలెండి. అది ఆయన స్వంతభూవా? యిద్దరమూ కౌలుకి జేసుకొనే వాళ్ళమేగా?

రం : అవుననుకో. అయితే...సరే...యెంతిస్తావు?

మొ॥రై : ఆయనిచ్చే కౌలెంతో చెప్పండి.

రం : యకరానికి 15 బస్తాలు.

మొ॥రై : నేనింకో బస్తా యెక్కువపెడతా. అంతకంటే...

రం : మరి ఆయన 17 యిస్తాసంటే?

మొ॥రై : అట్టాయిస్తానంటే ఆయనకేయివ్వండి. మధ్యలో మామూలాన తమరు నష్టపడటమెందుకూ?

రం : సరే. రేపోయెల్లుండో కనపడు.

మొ॥రై : వస్తా

రం : మంచిది. (మొదటిరైతు వెళ్తాడు.)

రం : ఆఁ...నువ్వొచ్చిన పనేంటయ్యా?

రెం॥రై : అదే...అదే...యీసారికి గట్టెక్కించారంటే...పిల్ల పెళ్ళి......

రం : డబ్బా? డబ్బుకీ కొంచెం కటకటగావుందయ్యా...సరే... యెంతగావాలినీకూ?

రెం॥రై : వెయ్యా.

రం : వెయ్యిచాలా?

రెం॥రై : ఆఁ. అంతమట్టుకు చాలండి.

రం : మరి వడ్డీ?

రెం॥రై : మీయిష్టం.

రం : అట్లా అంటేగాదు. చల్లకొచ్చి ముంతదాచటమెందుకూ? చెప్పు.

రెం॥రై : తమరిష్టమన్నాగా. యెంతఅయితేఅంతా.

రం : యిప్పుడు రూపాయిచ్చినికి యెవరూ తక్కువ యివ్వటం లేదు. తెలిసిందా? యేదోనువ్వు కావాల్సినాడివి గాబట్టీ పిల్లపెళ్లికని మరీమరీ అడుగుతున్నావు గాబట్టీ, రూపాయి వడ్డీకియిస్తా. సరేనా?

రెం॥రై: చిత్తం. తమరిష్టం అన్నాగా. మళ్ళీ ఐదారునెలల్లో యిచ్చేస్తా.

రం : ఐదారునెలల్లోగాకపోతే నీయిష్టమొచ్చినప్పుడియ్యి, సరా?

రెం॥రై: చిత్తం.

రం : అయితే రేపుసాయంత్రంరా. ఆ?

రెం॥రై: చిత్తం. వస్తా.

రం : మంచిది. (రెండవరైతు వెళ్తాడు.)

రంగయ్య కుర్చీలోంచిలేచి చేతులు వెనక్కిపెట్టి వరండాలో అటూ యిటూ, ఆలోచనా నిమగ్నుడై, తిరుగుతాడు.

ఇంతలో కరుణ వస్తుంది.

రం : యేమిటే యిట్లావచ్చావ్?

కరు : తమరికోసమే.

రం : యెందుకూ? గింజలు లేవని యిందాక నీబాబుకి చెప్పాగా?

కరు : గింజలకిగాదు.

రం : మరి? డబ్బుకోసమా? డబ్బు యిప్పటిమాటగానీ అన్న మాటలేదు.

కరు : కాదు. నేనుయెంతో అవసరమయ్యివొచ్చా......

రం : అవునూ. అయితే నేనేం జెయ్యగలనూ?

కరుణ చేతులునులుముకొంటూ, సిగ్గుసిగ్గుగా, లాలింపుగా చిరునవ్వు చిలకిస్తుంది రంగయ్యా ముఖకవళికలు మారిపోతాయి. మెత్తబడతాడు.

కరు : (ఆ అభినయంలోనే) నేను మీరుజెప్పిన పనికళ్లా వొప్పుకొంటా...

రం : ఆమాట యిదివరకేప్పుంటే యెంతబాగుండేదే పిచ్చిదానా!

కరు : తమరెక్కడికి రమ్మంటే అక్కడికి ... ...

రం : యెక్కడికో యెందుకు? యింట్లో యెవరూ లేరు. మీదొరసానీవాళ్లు పుట్టింటికెళ్లారు..పద..లోపలికిపద...

జెరుకు జెరుకుగా కరుణలోపల కెళ్తుంది. రంగయ్యా జేబులోంచి వొక మనీపర్సు సర్రునలాగి, అందులోంచి రెండుపదిరూపాయలనోట్లు తీసినేత్తో పుచ్చుకొని, మళ్లీయేదో ఆలోచించి వొకనోటు పర్సులోపెట్టి, రెండోనోటు చేత్తోపుచ్చుకొని, పర్సు టేబులుమీదపెట్టి వుండిపోయి, లోనికెళ్తాడు.

ఇంతలో అబద్ధాలువచ్చి, టేబిలుమీదువున్న మనీపర్సుచూసి, అటూ యిటూ దొంగచూపులుచూసి, ఆపర్సును దబ్బున బొడ్లోదోపి, వెళ్లిపోతాడు.

ఆతర్వాత కోటేశు వస్తాడు. "దొరా, దొరా," అనిపిలుస్తాడు. యెవరూ పలకరు. అతను వెళ్లిపోబోతూంటే, రంగయ్యా లోనికివస్తాడు.

రం : నువ్వేనంటావ్ నన్ను పిలిచింది?

కో : (వెనక్కి తిరిగివచ్చి) నేనేనండీ.

రం : యెందుకూ?

కో : సాయరాన యిస్తాలు జల్లాలంటిరిగా!

రం: అయితే వచ్చినాడివి విస్తర్లు సావిట్లో వున్నయ్యిగా, యెత్తుకుపోరాదూ? నన్ను పిలవటమెందుకూ? (కుర్చీలో కూచుంటూ, టేబిల్ మీద చూస్తాడు. ఫస్సు లేదు. గభాలున లేస్తూ) అరే! ఫర్సేదీ? యేంరా, యిక్కడ మనీఫస్సుండాలి. యేదిరా?

కో : యేమోనండి.

రం : టట్ లంజకొడకా. నువ్వుదప్పితే యిక్కడికెవ్వరొచ్చార్రా?

కో : యేమోనండీ, నేనెరగను దొరా. వొట్టు.

రం : నీకెవరన్నా కనపడ్డారా?

కో : లేదండీ.

రం : మరి? ఫర్సేదిరా?

కో : నాకు తెలవదండి. అమ్మతోడు. దేవుడితోడు.

రం : టట్ లంజకొడకా. (అబద్దాలు వస్తాడు.)

అబ : పెదసుబ్బయ్య యింటికాడ లేడండీ. మరి......

రం : పెదసుబ్బయ్య యేగంగలో కలిశాడో వుండరా...

అబ : ఆ? ఆ? యేం జరిగిందండీ?

రం : ఫస్సుపోయిందె!

అబ : ఆఁ ఆఁ—!!!

రం : అందులో నాలుగొందలుండెయ్యి.

అబ : అట్టాగా!!

రం : నేను అది యిక్కడపెట్టి యింటోకెళ్ళి వచ్చేసరికి.......

అబ : యెవరన్నా వచ్చారేమో చూశారా?

రం : యెవరూ రాలేదు. వీడే వున్నాడు నేనువచ్చేసరికి.

అబ : యింకేం? యీడే తీసుంటాడు!

కో : లేద్దొరా. అమ్మతోడు.

అబ : వోరుంచరా లంజ్జికా. మీ జాతి యెటువంటిదిరా?

రం : యేరా, చెప్పవేరా?

కో : సామితోడుదొరా.

రం : వోరి నీ స్వామినీ గీమినీ టంగలోతొక్క, ముందు ఫర్సు అక్కడపెట్టరా.

అబ : అబద్ధాలెందుకురా? నిజంచెప్పరాదూ? ఆయన్గాయనకి యిచ్చేస్తే నిన్నేమీ చెయ్యడుగా!

రం : యిక యిట్టాగాదు. నారే, అబద్ధాలూ నువ్వేపోయి పోలీస్టేషన్‌కి టెలిగ్రాం యివ్వు. యిదుగో డబ్బు. (జేబులోంచి చిల్లర తీసియిస్తాడు. అబద్ధాలు వెళ్తాడు) హారి లంజాకొడకా...యెంతపని చేశావురా!

# నాలుగో రంగం

## రంగడి యిల్లు

యింట్లో, మంచంమీద రంగివొక్కతేవుంది.

కను : (లోపలికొచ్చి) అమ్మా...అమ్మా...యిదుగోడబ్బు... పదిహేరూపాయలు!

రంగి : (కళ్ళుదెరచి, అతిదీనంగా) పది...రూపా...యలా? మాతల్లే...రప్పించావే...యెక్కడిదిడబ్బు?

కరు : మరే......

రంగి : ఆఁ? అప్పు...తెచ్చావా?

కరు : వుహూఁ......

రంగి : మరెక్క......?

కరు : మరే......

రంగి : ( కరుణముఖంలోనిసిగ్గుచూసి, అనుమానించి ) యెక్కడిదే?

కరు : మరే రంగయ్యదొరో...

రంగి : అప్పుయిచ్చాడా? మన..దిగుబాటు..కింద...యిచ్చాడా?

కరు : యేదీగాదు......

రంగి : ఆ? చె...ప్పు...వే...

కరు : అందుకు యిచ్చాడు...

రంగి : యెందుకు?

కరు : (సిగ్గుఅభినయిస్తుంది. రంగి గ్రహిస్తుంది.)

రంగి : (దగ్గుతూ, దడాలున మంచంలోంచి సగంవరకూ బిగించిన చేతివ్రేళ్ళతో లేచి, భీకరంగా చూస్తూ) ఆ? హా? (అంటూనే ప్రాణంవదుల్తుంది.)

కరు : (బిగ్గరగా అరిచి) అమ్మా ... అమ్మా ... (దగ్గరకెళ్ళి వొంటిమీద చెయ్యేసి) చచ్చిపోయింది!...అమ్మా... అమ్మా... (యేడుస్తుంది జుట్టుపీక్కుంటూ)

మరి : (లోనికొస్తూ) యేందోలమ్మా, యింతపొద్దోయినా దీపమన్నా లేదూ? ఆఁ? అన్నా? యెవరాయేడిశేదీ? పిల్లా? (దగ్గరకెళ్ళి) యేంజరిగిందే? సచ్చిపోయిందా యేమే? (మంచందగ్గిర కెళ్ళిచూసి) అయ్యో..అయ్యో... యెంతపనిజరిగిందే! (కరుణను భుజంమీద తట్టుతూ) నీ కెన్ని బాదలొచ్చినియ్యే...సూడూ...పిల్లా...నీబాబుని.

కరు : ఆఁ—!! నాబాబుని?

మరి : సూరియ్యగారింటో దొంగతనానికి జొరబడితే పట్టుకొన్నారంట. అందరూ పారిపోయూరంట. మీబాబొక్కడే దొరికాడంట...

కరు : హమ్మో...హమ్మో...వస్తావుండు ... నువ్వు మమ్మగ్గిరవుండు...నేను...నేను... (అని జేటికి గబగబా వెళ్తుంది.) (గురవడు వస్తాడు.)

గుర : (లోనికొస్తూ) మరెమ్మా, వో మరెమ్మా...

మరి : వో యేందోరె, యెప్పుడొచ్చా? మనిషి సచ్చిపోయి, అంతా కుంపయ్యి, మేము యేడుస్తాంటే, ఆ యెప్పుడా పిలిశేవ్?

గుర : నేసేవప్పా.

మరి : ఆ యెందుకురశే?

గుర : యెందుకేందప్పా? నీకు తిప్పలొచ్చిపడింది.

మరి : నాకుతిప్పలేంది నీనోరుబడా!

గుర : నీకొడుకు రంగియొ్యారి మనీపర్సు కాజేశాడని పోలీసోళ్లకి కబురెట్టారు......

మరి : (లేస్తూ) ఆఁ—!!!

గుర : సత్తెం. అమ్మతోడు.

మరి : వోయమ్మో... (అంటూ గుండెలుకొట్టుకొంటూ జేటికి పరుగెత్తుతుంది)

గుర : (బొడ్లోంచి అగ్గిపెట్టెతీసి పుల్ల వెలిగిస్తా) యీయింటో దీపంగూడా లేదు... రంగమ్మ కెట్టావుందో... (మంచం దగ్గిర కెళ్తూ) రంగమ్మప్పా...రంగమ్మప్పా...పలకదే... (యింకోపుల్లగీసిచూసి) నా...రా...యణ... సచ్చిపోయింది...హుఁ...బతుకంటే యింతేగందా...పిచ్చితల్లి. మాపుణ్యాత్తురాలు...మాలజాతిలో యిట్టాంటిది... (దీపం వెలిగిస్తాడు.) హూ... యిల్లు శావుకు మంటాంది. (వొకమూల వొక యెంగిలిచుట్టచూసి) వోహో చుట్ట వుండదే..రంగన్న కాల్చేసి దాశివుంటాడు..పొద్దుటిమట్టికి మహేకుతిగా వుండది.. (ఆఎంగిలిచుట్ట ముట్టిస్తాడు) అబ్బ. చలిగావుండది... ఆఁ... పాపం రంగడు!



# ఐదో రంగం

బజారు

వొకచోట శ్రీనివాసరావు, రాజగోపాలరావు కూచుని వుంటారు.

శ్రీని : యేఁరా పొద్దోయింది. మరి రేపటి సంగతేంటి?

రాజ : వోఁ. కానియ్ మరి. నేను మనవాళ్ళని నలుగుర్ని యెంబటేసుకొని మేగఫోనులో చెబుతాను, రేపు మాల పల్లె మీటింగువుందని.

శ్రీని : కాని వొక్కటి. యీ రంగయ్య బీదరైతుల్ని, మధ్య తరగతి రైతుల్ని మనమీద దుష్ప్రచారంచేసి రెచ్చ గొడుతున్నాడు. ఆడికా్కస్తి నువ్వు వివరంగా చెప్పాలి. యీనాడున్న పరిస్థితుల్లో పేదరైతులూ, మధ్యతరగతి రైతులూ యేనాటికైనా కూలీలపరిస్థితికి దిగజారక తప్పదనీ, అందువల్ల యిప్పుడే మేల్కొని కూలీల్తో చేతులుగలిపి యీ ప్రభుత్వ వ్యవస్థ మార్చడానికి ప్రయత్నించాలని—యింకా విరవంగా చెప్పాలి. ఆ?

రాజ : సర్లే. మరి మాలపల్లెలో కుర్రాళ్ళకి యేదో వొకటి చెబుతామన్నాంగా.

శ్రీని : యిప్పుడు పొద్దోయింది. యింకామేలుకొనుంటారా?

రాజ : యెందుకుండర్రా. లేపోతే లెగ్గొట్టి చెబుదాం. పొద్దున్నే పనికిపోతే సాయంత్రందాకా రారయ్యో.

శ్రీని : యిప్పుడేగంద మనం పొరుగూరెళ్ళివచ్చింది...

రాజ : యేంఫర్వాలేదు, నువ్వుపోయి అ పంత్రిని, మీాచిన్నాడికి యెట్లావుందో చూసిరా...నేనిక్కడేవుంటా...

శ్రీని : మరి నీ అన్నం......

రాజ : నాకు ఆకలిగా లేదు.

శ్రీని : అరె!

రాజ : నిజం నువ్వుపోయిరా...

(శ్రీనివాసరావు వెళ్తాడు)

రాజ : అన్నం, అన్నం! పనుంటే అన్నమేంటి సున్నమేంటి? పనయ్యినాకే అన్నం......

కొంతసేపటికి కరుణఅటువస్తూంది. జుట్టుజీబిరిగా, ముఖం ఆందోళనగా వుంటుంది.

కరు : యెవ్వరండీ ఆనూసుందీ?

రాజ : (విసగడగా) యేం? నేనే.

కరు : తమురా గోపాలరావుగోరూ?

రాజ : ఆఁ. నేనే. యేంగావాలీ? శ్రీనివాసరావు గావాలా?

కరు : ఆఁ. ఆఁ. అందుకేనుండీ......

రాజ : వ్వాల్లోలేడు...పొరుగూరెళ్ళాడు...

కరు : (యేంటో నిరుత్సాహంతో) ఆఁ——!!!

రాజ : రేపుగాని రాడు...సరా? (కరుణ వెనక్కితిరిగి వెళ్తుంది)

కొంతసేపటికి శ్రీనివాసరావు వస్తాడు.

రాజ : యేంరా అప్పుడే వచ్చావ్?

శ్రీని : యింటిదాకా వెళ్ళాను. కోటివాడు పనివుండి అన్నం తినక పోతే, అదే పనివున్న నేను తింటే యెట్లాగని నామీద నాకే అసహ్యంవేసి వచ్చాను...

రాజ : ఆరి నీయింటు కైగా! భలేవాడివే! సరేలేవ... వాడు నీకోసం మళ్ళీకబురువచ్చింది ..

శ్రీని : యెందుకూ? రాందీ?

రాజ : నువ్వాళ్ళో లేవనిచెప్పా. వెళ్ళిపోయింది.

శ్రీని : అరె! నేనచ్చేదాకా వుండమనక పోయావూ? యేంపనిమీద వొచ్చిందో పాపం!

రాజ : లేకపోతే యేంట్రా సెఘనన్యాసేనూ? దాంతో నువ్వు మాటి మాటికీ మాట్లాడుతూంటే ఆ సెఘన అబద్దాలుగాడు నీకూ దానికీ లంకెపెట్టి సెఘప్రచారం చేస్తుంటే!

శ్రీని : వాడెవడో గద్దెనెక్కినవాడు యేదో అన్నాడని మనం వెనకడుగు వేస్తామూ? వెనకయిలాంటి నెపంతో సరోజినీ నాయుడు మొదలైనవారిమీద అపవాదాలు వేశారు. యిప్పుడు మనరాజకీయాల్లో యెవరూ వాళ్ళనే సత్తాలేక యిట్లాయేడుస్తున్నారు. అందుకే మనం వెనకేస్తే యింకా యికంతా యెందుకూ? హాయిగా నీయింట్లో నువ్వూ నాయింట్లో నేనూ పడుకోవచ్చుగా?

రాజ : లేకపోతే యేంట్రా సెఘనన్యాసేనూ?

శ్రీని : ఆఁ పోరా జీలకర్రా.

రాజ : అరె!

శ్రీని : యీ జరిగే సన్నాహాలెన్నాంగా. యికపద. ముందు అక్కడికిపోదాం.

# ఆరో రంగం

## రంగయ్య యిల్లు

వసారాలోని టేబిల్ మీద వక లైటు వుంటుంది. కుర్చీలో రంగయ్య, భూషయ్యలు. అబద్దాలు అరుగుమీద. లైటు కో టేసూ, మరియమ్మ నుంచుని వుంటారు.

మరి : (కొడుకుతో) యేరా, దొంగలంజకొడకా, నిజం శెప్పరా నా పరువు తియ్యమాకరా...

కో : నేనేమీ యెరగనే. నీతోడే.

మరి : తిండుండా లేపోయినా, మనం పరువుగా బతికాంరా. నా పరువు తియ్యమాకరా. దొరగోరి శేత వొక్క మాటన్నా పడ్డాళ్లంగాదురా.

కో : యేవొట్టు బడితే ఆ వొట్టమ్మా.

మరి : ఆరి ముండలంజకొడకా, నిజం శెప్పరా. నువ్వు యే మాత్తరమో దొంగపని శేసుందే దొరగోరు వూరికినే అనర్రా.

కో : నన్ను నిలువునా కొయ్యండి. సంపండి... అదేమాట...

అబ : ఆరి వుండరా దొంగలంజాకొడకా!

మరి : ఖుదుగోనియ్యాయ్, మాటలు కొంచెం జాగర్తగా రానియ్యి. నీకేం సంబందమయ్యా నువ్వు నోరు పారేసు కొంటావూ? మా దొరగోరిడబ్బు పోయింది, నేను నా కొడుకుని అడుగుతుండా! మద్దెలో నీదేందియ్యా?

అబ : ఆశీ...

మరి : ఆశీ గీశీ అనమాక...

అబ : అంటే?

మరి : అంటేనా? పీసు కేగుద్ది!

కో : నువ్వెవరివయ్యా మాట్లాటానికీ?

అబ : చూశారా, రంగయ్యగారూ, నేనేమన్నానో వాళ్ళేమంటన్నారో?

రం : నీకెందుకురా పెత్తనం? నువ్వూరుకోరాదూ?

మరి : హూఁ. కలకాలం బతకండి దొరా, కరకట్టుమాట మాట్లాడారూ!.... యేఁరా.... బాబూ.... నీకాల్లకి మొక్త తా. (కాళ్లుపట్టుకొంటుంది. లేస్తూ) నిజం శెప్పరా.... మన దొరగో శేరా. నిన్నేమీ శెయ్యర్రా. నీపేణానికినా పేణం అడ్డంయేస్తారా.. బాబ్బాబు..(గెడ్డంపట్టుకొని బతిమాలుతూ) బాబ్బాబు....

కో : యేఁ...(అంటూ చేతుల్లో ముఖంపెట్టుకొని యేడుస్తాడు)

మరి : నాబిడ్డే...(అతడ్ని నిమురుతూ) యేడవమాకయ్యా (అని తానుగూడా బోరుమని, తిప్పుకొని) యేందొరగోరు, ఆడుయెరగ నంటన్నాడే...

రం : యెరగననక యేమంటాడేఁ? దొంగతాను దొంగనని వొప్పుకొంటాడా?

మరి : యెంతమాట అన్నావుదొరా! మీయగ్గిర మేముయిన్నాళ్లె బట్టి తిరుగుతుండాంగందా, యెన్నడన్నా యిట్టాంటిపని యెరుగుదుమా?

రం : యెన్నడూ లేకపోతే యిప్పుడొచ్చిందిగా. చాలదూ?

మరి : యేంఁడుండీదొరా అట్టా మాట్టాడతారూ? మాయింటా వంటా యిక్కైదూను తరాలుదాకా మేం యెరగమండి..

రం : అయితే నేను అబద్ధమాడుతున్నా నన్నమాట?

మరి : ఆమాటతేమున్నెట్టా అంటానండీ?

రం : మరి?

మరి : యేంఁమండిదొరా మరీకొత్తగా మాట్టాడతారూ?

రం : యిందులో కొత్తా లేదూ; పాతా లేదు.

మరి : తమురంటోరికి...

రం : వాళ్ళా, నాదగ్గిరానున్నా చెప్పొచ్చే? అమ్మపుట్టిల్లు మేనమామదగ్గిరా పొగిడేదీ? నీ ఇయ్యంకుణ్ణి—రంగణ్ణి —దొంగతనం చేస్తాన్రంటే, యీరా(?)పట్టుకోలా?

మరి : యేమో యేంజరిగిందో యెవ్వరికి తెలుసు?

రం : అసలెట్టుకొన్నారా లేదా?

మరి : ఆఁ.

రం : అంతేగండి? అయితేయింకేం? ఆయనసగారిఅల్లుడు తప్పున తింటాడా?

మరి : యిమగోదొరా. తమురేమన్నా అనుకోండి. నేను యేపెమాణం చెయ్యమంటే అదిచేత్తా, నాకొడుకు మాత్తరం ఆపని శెయ్యడు.

రం : వాళ్ళి వ్రాసుకోవే లంజముండా. కొడుకు దొంగతనంచేస్తే యింకాసిగ్గులేక వెనకేసుకొస్తా?

అబ : పైగా ఆమాటలు జూడండి, వాళ్ళపొగరెక్క!

మరి : (రంగం-గో) నువ్వెవడివయ్యావే కుక్కమొరిగినట్టు మొరుగుతావూ?

అబ : ఆఁ. లంజముండ. నీయ...

మరి : మెమ్మ సదాకునాట్టులంజ! యెవ్వరిమ్మాలంజా?

అబ : నీనొన్నకు కళ్ళుజూస్తా గుడిసేటి రంకుముండా. నీయ...

గో : నీ తలపెంకు ప్రాపెట్టించయ్యా మరీమరీ వాగితే...

రం : ఊరి నువ్వూరుకోరా అబ్బాయా.

మరి : దొరగోరికంటే, దొరగోరి నాకెటికాకుండే కుక్కకి రోసమెక్కువన్నట్టు, రంగియ్యగోరికంటే నువ్వేరాజుకి మళ్ళే మాట్లాడతండావేంటా?

అబ : చూశారండీ ఆ మాటలూ?

రం : అప్పటంటిరాంప గొడవేస్తే అంతా మన మొఖాన పడతది. ఆ అలికీవాళ్ళని కదిలించటమెందుకు, ఆమాటలు పడట మెందుకు?

మరి : యేందండీ దొరా అష్టమైనమాటలూ అంటారూ? యెంత కూలి సేసుకొనే వాళ్ళమైనా, మేమూ మనుసులగానే బతికాముండి. శెపి యీయి బతికలా.

రం : యేందే ఆ వాగుడూ? నిన్నెవరు రమ్మన్నారిక్కడికి?

మరి : నా కొడుకుకుండాడు. వచ్చా. నన్నెవరు రమ్మనేదేంటి?

రం : ఒసి మాదర్చోదుముండా మాటలు ఖాళీగారానియ్యవే. నమునిక్కట్లంచిముంచు. హుఁ. పద.

మరి : నా కొడుకుని యిడిశిపెట్టు. పోతా.

రం : నా మనీపర్సు యివ్వు. విడిచిపెడతా...పో...నడువ్...
హు...పద... (అరుస్తాడు)

మరి : (వృద్ధ కంఠంతో యేడుస్తూ) యీ ముండలంజకొడుకు నా
కడుపునబుట్టి నా పరువుదీశాడు.....సావనియ్యి......
యిట్టాంటి లంజకొడుకులు బతికితేయేం, సస్తేయేం?...
నేపోతన్నా...నీశాత యిన్నిమాటలుబడి నేనువుంటానా
నీ స్తలంలో...ఛీ... (వెళ్లిపోతుంది.)

శ్రీనివాసరావు, కరుణ మరోవేపునుంచి వస్తారు. భర్తను చూడగానే
కరుణ వచ్చేవచ్చే యేడ్పుని ఆపుకోటానికి నోట్లో
చీరకొంగు కుక్కుకొంటుంది.

శ్రీని : (బయటనుంచి) రంగయ్యగారూ, యేమిటండీ యిదీ?

రం : (పలకడు)

శ్రీని : యేమండీ? మిమ్మల్నేనండీ పిలచేదీ?

రం : నన్నా? యెందుకూ?

శ్రీనీ : యేమిటిదంతా అని అడుగుతున్నా?

రం : అడగటానికి నాపైగవర్నరువా నువ్వు?

శ్రీని : నీకోటిమనిషిని!

రం : యేముంది? యేమీలేదు. పర్సుకొట్టేశాడు. నిలవేసాం.
పోలీసులకి కబురంపాం. అంతే. సరా?

శ్రీని : పర్సు కొట్టేస్తుంటే మీరుచూశారా?

రం : ఆఁ.

శ్రీని : నిజంగా?

రం : నిజంగా! నాకళ్లతో! నారెండుకళ్లతో!! సరా?

శ్రీని : యెందుకండీ ఆమాటలు?

రం : యేం, నమ్మకం కుదర్లేదా?

శ్రీని : లేదు.

రం : యెందుకనీ?

శ్రీని : తమ పాతచరిత్రచేత.

రం : యేమిటిది?

శ్రీని : యేమిటా? మీకు తెలవదూ? వెంకన్నగారి శోభనాద్రి మీకుబాకీవున్న నోటుతాలూకు నాలుగొందలు తెచ్చి, మీమీద నమ్మకంతో శెల్లురాయమని యిచ్చిపోతే, మీరు ఆడబ్బు మెక్కేసుకొని, తర్వాత నేనెరగనని ప్రమాణంజెయ్యలా? ఆ దిగుల్తో ఆశోభనాద్రి మంచం బట్టి మీకుబడి యేడుస్తా చచ్చిపోలా?

రం : యికచాలుగాని కట్టిపెట్టు.

శ్రీని : మీరుయెంతమంది కూలీలకి యేదోవంకబెట్టి గింజలెగ గొట్టలేదో కాస్త గుండెమీద చెయ్యివేసుకొనిచెప్పండి. మీరు నాముపద్ధతిమీద గింజలుయిచ్చియెన్నికుటుంబాల రక్తం పిండటంలేదో చెప్పండి...

రం : యేంటిదంతా? (అరుస్తాడు)

శ్రీని : ఆ. నీ ప్రభుత్వాలకి చెవిటి మనిషినిగా మనేను ఆలు. రంగడికి రెండేళ్ళనాడు యివ్వాల్సినగింజలు యివాళ్లా యిచ్చావా? ఆయింటో యివాళ యెంతయమసరకంగా వ్రతం, పంచభక్ష్య పరమాన్నాలుతినే నీకెట్లా తెలుస్తుంది? యింతకష్టజీవుడైన నువ్వు నిజంపలుకుతానంటే నేను నమ్ముతానా?

రం : అయితే నన్ను కొట్టటానికొచ్చావా?

శ్రీని : లేదు. కమ్యూనిష్టుపార్టీకి ఆఉద్దేశం లేనేలేదు. అయితే మామీద దౌర్జన్యం ప్రయోగిస్తేమాత్రం మేముచేతులు ముడుచుకొని కూచోం. తెలిసిందా?

రం : మరి నువ్వెందుకొచ్చినట్టు?

శ్రీని : ఎందుకా? మేముప్రజాసేవకులం. ప్రజలకి అన్యాయం జరుగుతుంటే మేంచూడలేము. ప్రజలకష్టాలు తొలగించటానికి మేము పనిచేస్తున్నాం. అందుకనిచొచ్చాను.

రం : అయితే యిక్కడేమీ కష్టాలు లేవే?

శ్రీని : లేకేం? కొత్తేసు సంగతేంటి?

రం : వాణ్ణినేనేమీ కొట్టలేదే నాపద్నుకొట్టేసినా?

శ్రీని : కాలంమారింది. కొట్టకుండా వ్రాయకొన్నావు. యేదేనమి లెక్కకింపకు నువ్వు కూలీల్ని చీటికీమాటికీ యెట్లాకొట్లా నాడిచో జ్ఞప్తికితెచ్చుకో...అసలు కొట్టకుంమేమంమను! అట్ల యెన్నిబూతులుతిట్టావో! మాసంగలవాడు దెబ్బకి బాధపడడు; మాటకి బాధపడతాడు! తెలిసిందా?

అబ్బ : సరిమగాడా!

శ్రీని : (అవెనిని) అక్కడకూడా మన్నాడే అబద్దాలు—అతడికిప్పుడు లోకమంటే యేంటో తెలకుండా వుంది. మీదగ్గిర నాలుగుడబ్బులు యేసుకొంటూ మొగాణ్ణనుకొంటున్నాడు. వస్తుథా తాను కూలివాడైనప్పటికీ కులంగొప్ప అని మురిసిపోతున్నాడు. కూలీసంఘాలమీదా, రైతు సంఘాలమీద, పార్టీమీదా అభాండాలు వేస్తున్నాడు. తనస్థితేమిటో, తానేమిటో యింకా గ్రహించలేడు. తోటివాడు తొడకోసుకుంటే తాను మెడకోసుకుంటున్నాడు. ధనికరైతుమీదు యేమాటలంటే తానూ అదేమాట అంటున్నాడు. రాజుగారి కోడలు మేడెక్కితే పంతానికి కుమ్మరాయన కోడలు గుడిసెక్కినట్లు, మీతోపాటు తానూ విర్రవీగుతున్నాడు. అయితే మీమోసం తెలుసుకొంటే వొకనాటికైనా అతను పశ్చాత్తాప పడకపోడు.

రం : యేంటోయ్ ఆమోసమూ?

శ్రీని : యింకేంచెప్పాలి? చెప్పిందిచాలు. నువ్వుచేసే మోసమంతా చెప్పాలంటే సంవత్సరాలు పడుతుంది! యీ అబ్బాలు అమ్మనమ్మ నీదగ్గిర యెనిమిదివందలరూపాయలు యెవరికీ తెలీకుండా దాచుకొంటే నువ్వు ఆమెచావగానే మింగేస్తూరుకోలా?

రం : యెవరికి తెలీనిసంగతి నీకెట్లా తెలిసిందీ.

# యేడో రంగం

## మాలపల్లెలో వొక ఖాళీ ప్రదేశం

కూలీల మీటింగు జరుగుతూంది. అక్కడ కోటేశూ, కరుణా, అబద్దాలూ, గురవడూ, మరియమ్మా, యింకా చాలామంది కూలీలూ వుంటారు.

శ్రీని : (చాలా వుద్రేకపూరితంగా) బాగా ఆలోచించండి యిదే రకంగా మనం బాధలుపడటమా, లేక బాధలు పడే వాళ్ళందరమూ — బీదాళ్ళందరమూ — యేకులానికి, యేమతానికి చెందినా — అందరమూ వొక కట్టుగానిలిచి మనహక్కులు సాధించుకోటమా? యేది? చెప్పండి. భయం వదిలేసెయ్యండి. యెంతో కాలంనుట్టీ — మన తాత ముత్తాతల కాలంనుట్టీ — భయపడుతూవచ్చాం! అయితే మనం భయపడినందువల్ల, మనం యీరంగయ్య వంటి భూస్వాముల బూతులూ దెబ్బలూతిని భయపడి వూరుకున్నందువల్ల, మనబాధలు, మన పేదరికం పోయినయ్యా? చెప్పండి? లేదు. పోలేదు. యెందువల్ల? మనలో ఐకమత్యం లేనందువల్ల! మనలో కట్టుబాటు లేనందువల్ల? యీరంగయ్యలాంటిభూస్వాములు యేం చేస్తారోనని భయపడినందువల్ల! అవును. భూస్వాములు యే పనన్నా చేస్తారు. యెన్ని అబద్ధాలైనా ఆడతారు. యెన్నికలకి ముందు మూడేళ్ళు యీభూస్వాములు యెన్ని రాక్షసకృత్యాలు చేయించారో, యెంతమంది రైతు కూలీబిడ్డల్ని తుపాకీ గుళ్ళకి బలిచేయించారో, మీరు యెరగందిగాదు

శ్రీని :
కరు :
కో :
రం : } ఆఁ—!!!

అబ : యిక నాకేంభయంలేదు. నీయిష్టమొచ్చినట్టు చేసుకో. నేను దొంగతనంచేస్తే పొట్టకోసం చేశాను. నువ్వు మమ్మన్మ్రషబ్బ దొంగతనంచేస్తే నీకాలినటానికి యెంకో వుండా చేశావు. నేనుదొంగనైతే నువ్వు పరమదొంగవి. నేను లుచ్ఛానైతే, నువ్వు పరమలుచ్ఛావి. పద. యేజ్జి నిన్నుగాదని నీకుశిక్షవెయ్యకుండా రాకుమెట్టా శిక్ష వేస్తాడో చూద్దాంపద. యేం, మాట్లాడవేంటి? నిన్ను మింగబోటంలేదులే.

శ్రీని : తేలుకుట్టిన దొంగా నోరుమూసుకున్నావా?

రం:(పిచ్చెక్కినట్లయ్యి) వుండండి. మీఅంతు తేల్చుతానుండండి.

అబ : నువ్వుగాదుగందా నీతాతలు పదివేల మందైయినా మాఅంతు తేల్చలేరు.

శ్రీని : మాపక్షన్యాయం, ధర్మంవున్నాయ్. మాకుభయంలేదు.

కో : యేందియ్యా నువుజేసేది పిసకలా?

శ్రీని : పదండి. వెళ్దాంపదండి.

రం : పొండి. మీతాడు తెంచుతాపదండి. హుఁ. పూటకూటికి గతిలేదు పరవళ్లా?

అబ : సిగ్గు సత్తువలేదు పాసవాలకివుందా? యెంటయ్యానువ్వు చేసేది గోంగోరా? (అందరూవెళ్తారు.)

# యేడో రంగం

## మాలపల్లెలో వొక ఖాళీ ప్రదేశం

కూలీల మీటింగు జరుగుతూంది. అక్కడ కోటేశూ, [illegible], అబద్దాలూ, గురవడూ, మరియమ్మా, యింకా చాలామంది కూలీలూ వుంటారు.

శ్రీని : (చాలా వుద్రేకపూరితంగా) బాగా ఆలోచించండి యిదే రకంగా మనం బాధలుపడటమా, లేక బాధలు పడే వాళ్ళందరమూ — బీదాళ్ళందరమూ — యే కులానికి, యేమతానికి చెందినా — అందరమూ వొక కట్టుగానిలిచి మనహక్కులు సాధించుకోటమా? యేది? చెప్పండి. భయం వదిలేసెయ్యండి. యెంతోకాలంమట్టీ — మన తాత ముత్తాతల కాలంమట్టీ — భయపడుతూవచ్చాం! అయితే మనం భయపడినందువల్ల, మనం యీరంగయ్య వంటి భూస్వాముల బూతులూ దెబ్బలూతిని భయపడి వూరుకున్నందువల్ల, మనబాధలు, మనబీదరికం పోయినయ్యా? చెప్పండి? లేదు. పోలేదు. యెందువల్ల? మనలో ఐకమత్యం లేనందువల్ల! మనలో కట్టుబాటు లేనందువల్ల? యీరంగయ్యలాంటిభూస్వాములు యేంచేస్తారో అనిభయపడినందువల్ల! అవును. భూస్వాములు యేపనన్నా చేస్తారు. యెన్ని అబద్ధాలైనా ఆడతారు. యెన్నికలకు ముందు మూడేళ్ళా యీభూస్వాములు యెన్ని రాక్షసకృత్యాలు చేయించారో, యెంతమంది రైతు కూలీబిడ్డల్ని తుపాకీ గుళ్ళకి బలిచేయించారో, మీరు యెరగందిగాదు

అయితే అంతమాత్రాన ప్రజలపుద్యమం వెనకబడిందా? లేదు. యెందువల్ల? మనపట్లన్యాయం, ధర్మంవున్నాయి. అందుకని మన వుద్యమం చావలేదు; చావులేదు దానికి. అందువల్ల మనంభయపడాల్సిన అవసరం యేమీలేదు. యింకా భయపడితే తాము యెన్నో గొంతులుకోసి సంపాయించిన ఆస్తులు పోతాయని భూస్వాములూ, జమీందార్లూ, కోటీశ్వర్లూ భయపడాలి. మనకు దేనికి భయం? మనం యెవరిసొమ్మూ దొంగతనంచేయబోటం లేదు. మనకష్టానికి తగ్గకూలి యివ్వమంటున్నాం. అంతే. అయితే పామూలు రైతులు యీ భూస్వాములుచేసే ప్రచారానికి మోసపోతున్నారు. వారికిమనం శాంతంగా అన్నీ వివరంగాచెప్పాలి. అంతేగాని. రైతులు యేదన్నా తొందరపడితే మనమూ తొందరపడరాదు. రైతులెప్పటికైనా యీ ధనికులమోసం గ్రహించుతారు. అంతవరకూ మనం వోపికపట్టాలి. భూస్వాములు అనేకవిధాల రెచ్చగొడతారు. మనం రెచ్చిపోగూడదు. శాంతంగా వుండాలి. మనకోర్కెలు చాలా చిన్న కోర్కెలు. వొకపూనైదు గింజలు కూలీ మనంయెక్కువ యిమ్మనిఅడుగుతున్నాం. నాముపద్ధతి పోవాలంటున్నాం. పాలేర్లకికొంచెంజీతంపెంచి శెలవులుయివ్వాలంటున్నాం. పనిలో స్త్రీ పురుషభేదం పెద్దగా చూడవద్దంటున్నాం. బూతులూ, దెబ్బలూ మానెయ్యాలని అడుగుతున్నాం. యివే మనకోర్కెలు. అయితేమనం పనిమాత్రం

ఖచ్చితంగా—అన్నప్రికారం—చెయ్యాలి. పనిలోమాత్రం లోపంరాగూడదు. యింకొకటి. దేశాన్ని మింగుతున్న అమెరికా దేశదేశాలకీ కోట్లకొద్దీడబ్బు పంపిచ్చి ,మనలో మతపిచ్చా, మూఢత్వం తెచ్చి పెడుతున్నది. యీమత ప్రచారకులు యీమధ్య మనపైన దండలకు పూనుకొన్నారు. అవినమ్మమాకండి. మోసపోకండి. అతేగాదు. మీకులపెద్దల్లో యెక్కువమంది యీభూస్వాములచుట్టూ తిరుగుతూ, యెన్నో బెదిరింపులు పెడతారు. వాటికి బెదరవద్దు. వొకకట్టుగానిలవండి. హక్కులుసాధించండి. మనంయిదివరకి రాజీప్రయత్నాలుజేశాం. భూస్వాములు అవన్నీ భగ్నంచేశారు. అందువల్లమనం నిలబడాల్సి వచ్చింది. యిదేసమ్మెపిలుపు. అందుకోండి. రేపటినుంచీ సమ్మెగట్టి, ప్రశాంతంగానిలబడి, యెన్నిబాధలకైనా నోర్చుకొని, హక్కులు సాధించండి!!!

గుర : (మెల్లగా) దొరా, దొరా, పోలీసులు!

శ్రీని : రానియ్యి మరేంఫర్వాలేదు.

(పోలీసులు పోలీసులని సభికుల్లో కలవరం.)

శ్రీని : కూచోండి, భయపడమాకండి. (అంతానిశ్శబ్దం.)

వొక సబ్ యిన్స్పెక్టరు, రంగయ్య, యిద్దరు ముగ్గురు పోలీసులు వస్తారు

అబ : కూచోండి కూచోండి. లేవొద్దు.

శ్రీని : యేమిటండీ?

సబ్ : నిన్నూ...యింకాయెవర్నండీ? (అని రంగయ్య వైపు తిరుగుతాడు)

రం : అదుగో వాడూ, వాడిపేరు అబద్ధాలు. యిదుగో వీడు వీడిపేరు కోటేశు! యింకా యింకొక కుంటాఘుండాలి. వాడు లేడిక్కడ.

సబ్ : మీ నలుగుర్నీ అరెస్టు చేస్తున్నాం.

శ్రీని : యెందుకు?

సబ్ : బరిసెల్తో బాకుల్తో మీనలుగురూ నిన్నరాత్రి రంగయ్య గారింటిమీదపడి ఆయన్ని హత్య చేయటానికి ప్రయత్నం చేసినందుకు!

శ్రీని : పచ్చి అబద్ధం

అబ : పచ్చిమోసం!

సబ్ : షటప్. మొహతిరుగుతుంది.

శ్రీని : నేమెలా మాటాడుతున్నాం, మీరెలా మాటాడుతున్నారు?.

సబ్ : షటప్!

శ్రీని : యేమిటా దౌర్జన్యం?

...ప్!! యిడియట్ ... బుద్ధిలేమరా లంజా

...!!

...కుని నేనో నువ్వో ప్రజలే నిర్ణయిస్తారు.

... (అంటూ అతనిమీదకి పోబోతుంటే,

...తాడు) వెధవలంజాకొడకా...

శ్రీని : నువ్వాగు...

సబ్ : షూట్ చేస్తారా నాకొడకల్లారా మిమ్మల్నందర్నీ
మీ తాతతో జెప్పుకోవాలిపోయి!

శ్రీని: నీకులొంగుతున్నామనుకోమాక. కాలానికి లొంగుతున్నాం
గతంలో మీకు యెంతమందిని షూట్ చేసినా యేమి
ఫలితం లేకపోయింది!

సబ్ : అరేనా... (రంగయ్య ఆపుతాడు)

శ్రీని : వూం. సోదరీసోదరలారా. వస్తాం. మరచిపోకండి. రేపటి
నుండీ సమ్మెగట్టండి. హక్కులు సాధించుకోండి.

రాజగోపాల్ రావు గబగబా వస్తాడు.

రాజ : (వెనగ్గావచ్చి) ఆరే, నీచిన్నకొడుకు చచ్చిపోయాడురా.

శ్రీని : యేం చేద్దాం అందుకని?

రం : ఆం. వాడడుగోనండీ యింకొకడూ!

సబ్ : పదండ్రా (ప్రజలవంకతిరిగి) యేంట్రామీరంతా యిట్టా
వచ్చారూ? మీకు మీటింగా లంజాకొడకల్లారా!
పదండి. పదండి—...

శ్రీను మొ॥ వారిని తోసుకొంటూ పోలీసులు వెళ్లారు.

స్వతంత్ర భారత్ కి జై, భారత కమ్యూ
కూలీ సంఘాలకీ జై, రైతుసంఘాలకీ జై, కూలీ
జెయ్యాలి! మొ॥లగు నినాదాలు దిక్కులు పిక
మిగిలిన సభికులు.

( స మా ప్త ము





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B101 |
| పుస్తకం పేరు | సమ్మె పిలుపు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | aksharya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S.lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |